వనలతాదేవి తనభర్తను సేవలము దైవతుల్యునిగా భావించి యతని పనిని నౌకరులచేఁ జేయింపక తానే చేయుచుండెను. ఆమె పతిభక్తిని గాంచినవా రందఱు నిజమయిన పతిభక్తియనిన నిదియేగదాయని మెచ్చుచుండిరి. వ్యాధిలోనుండి భర్తకుఁ దాను భోజన మిడలేని సమయమునందు సహితమామె భర్తకును, కుమారునకును దనయెదుట భోజనము పెట్టించుచుండెను. ఈమె మరణదినమునం దీమె భర్తకుఁ గొంచెము దేహమస్వస్థముగా నుండెను. ఈమె మరణమున కరగంటకు ముందు భర్త వెచ్చని చొక్కా దొడిగికొనకుండుటను జూచి "మీశరీర మస్వస్థముగానుండినను మీరు వెచ్చనిబట్టలు తొడిగికొనక యేలయుంటిరి"ని యాయంగీని తెప్పించి యాతనికిప్పించి తొడిగికొనునట్లు చేసెను. తనమరణవేదన నొకమూల నుంచి పతికళ్యాణమునే గోరుసీకాంతయొక్క పతిభక్తి నెంతఁ గొనియాడినను దీఱదు. అనేకులను కొమకులకును, కూఁతుల నుగని వారినిఁ దననేర్పుచేఁ బెంచి పెద్దవారినిఁ జేసి తనకుఁగల శిశుపాలనము నందలి నిపుణతను వెల్లడింపఁ దనకు సమయము చాలకున్నను నీమె మిగుల దక్షతతోఁ బెంచి విడిచిపోయిన మూఁడుసంవత్సరముల బాలుని చర్యలు చూచినచో నామెకుఁ దెలిసిన మాతృకర్తృత్వ మహత్వ మితరమాతలకుఁ దెలియుట దుస్తరమని యందఱకును దోఁచును. అంత చిన్నశిశువు తనతల్లి యాజ్ఞప్రకారము వర్తించుచుండెను. ఇంత చిన్నవయసునందే వాని తల్లి వాని కెన్నో నీతులను గఱపెను. వనలతాదేవికిఁ దన రుగ్ణత కుదురదని స్పష్టముగాఁ దెలిసినపిదప నొకదినమునం దెవ్వరును లేనిసమయమునఁ దనచిన్ని కొమరునిఁ దనయొద్దికిఁ

పిలిచి "నాయనా! నాశరీరమున రోగము హెచ్చెను. అది యి
చటఁ బాగుకాదు. నేనుపరమేశ్వరుని సన్నిధికరిగిన నాబాధ
నివారణమగును. తదనంతరము బాగయి వచ్చెదను. నేను
పోవునపుడు నీవు ఏడ్వక సంతోషముగా బుద్ధి కలిగియుం
డుము." అని చెప్పఁగా నాబాలుఁ డౌననియెను! తదనంతర
మామె ౧౮౭౦వ సంవత్సరము నవంబరు 3వ తేది రాత్రి స్వర్గ
స్థయయ్యెను. ఆమెకొఱకై యామెబంధువు లందఱును విల
పించుచుండిరి. అప్పు డాశిశువు తల్లిమాటల యందలి విశ్వా
సము వలన నెంతమాత్రము నేడువక గులాబిమొదలగు పూ
వులను దెచ్చి తల్లిశవముపై నుంచి "యమ్మా దేవునివద్దికిఁ
బొమ్ము బాగయిరమ్ము" అని చెప్పి యామెను గొనిపోయిన
పిదప నేడ్చువారినిఁ గని "మీ రేల యేడ్చెదరు? మాయమ్మ రోగ
మిచట కుదురనందున దేవునికడకరిగెను. అచట బాగయి మ
రల రాఁగలదు. ఇట్లని నాతోఁ జెప్పిపోయినది" యని తన ము
ద్దుమాటలతోఁ జెప్పెను. ఈవనలతాదేవి మరణము తామె
బంధువులే కాక యామెను గనినవారును, నామె సద్గుణముల
ను వినినవా రందఱును మిగుల దుఃఖించుచున్నారు. ఈమెకు
మరణసమయమున నిరువదియొకటవ సంవత్సరము. ఈమె యింత
యల్పవయస్సునచే మృతినొందుట దేశముయొక్క దురదృ
ష్టమనియే చెప్పవలయును.

# గ ణ పాం బ

ఈమె బేతరాజునకు భార్య; గణపతిదేవునకుఁ గూతురు ఈగణపతిదేవుఁడు క్రీ. శ. ౧౨౪౯వ సంవత్సరమునుండి ౧౨౬౧వ సంవత్సరమువఱకును నోరుగంటి రాజ్యముఁ బాలించిన రాజేయై యుండినచోఁ గణపాంబరుద్రమదేవికిఁ గూతురై యుండును. కాని యిందునకుఁ బ్రబలనిదర్శనము లేవియుఁ గానరాకున్నవి. గణపాంబయుఁ దనపతి మరణానంతరమునం దాతని యేలుబడిలో నుండిన యాఱువేలగ్రామములను మిగుల నేర్పుతోఁ బాలించెను. ఆమె మిక్కిలి యౌదార్యవతియై యనేకవిధములైన ధర్మకార్యములను జేసెను. ఈమె ధర్మకృత్యములను జరితమును దెలుపు శిలాశాసన మొకటి కృష్ణామండలములోఁ జేరియున్న గుంటూరు తాలూకాలో నున్నది. దానిలోని కొన్ని సంగతుల నిందుఁ బొందుపఱచెదను.

"మిగుల ప్రసిద్ధిఁ గాంచిన కాకతీయవంశమునందు అనేక ప్రభువులు రాజ్యము చేసినమీఁదట వైరిభీకరుఁడగు బేతరాజు సింహాసనారూఢుఁడయ్యెను. శివునకుఁ బార్వతివలెను, విష్ణువునకు లక్ష్మివలెను, ఈ బేతరాజునకు గణపాంబ ధర్మపత్నియయ్యెను. ధర్మకటకపురిని మిక్కిలి యోగ్యముగాఁ బాలించి బేతరాజు కీర్తిశేషుఁడయ్యెను. తదనంతరం బాతనిభార్యయగు గణపాంబ సింహాసన మెక్కెను. ఈమె భర్తయొక్క సుగతి

నభిలషించి యీయనపేరిట ధన్యకటక పురమునం దొకదేవా లయము నిర్మించెను. ఈ యుద్దేశముతోనే యీరాణి బంగారు శిఖరముగల యింకొకగుడిని గట్టించి దానిలో బేటేశ్వరుఁడను లింగమును బ్రతిష్ఠింపఁజేసెను. ఈగుడికి నైరిగాదేవి ఫలవంత మగు బీనదీవియను గ్రామము నొసంగెను. ఈమహనీయు రాలు ధన్యకటకపురిలో ౧౨గురు బ్రాహ్మణోత్తములకు ౧౨ భూపసతులును ౧౨ గృహములును దాన మొసంగెను. ఈమె తనతండ్రియగు గణపతిదేవుని పేర గణపేశ్వరుని(శివుని) యాలయమొకటి కట్టించెను. ఈగుడికై యీరాణిచింతపాడు గ్రామము నొసంగెను. ఈ రాణిహస్తములు సతతము శివుని నర్చించుటయందే వినియోగించెను. శివుని మాహాత్మ్యమును బ్రకటించు శ్లోకములే యీమె కానుకము నిచ్చుచుండెను. ఈ రాణివేదములయం దధికవిశ్వాసముకలది కావుననే విశాల రాజ్యక్లేశము కలిగియున్నను ఆనందముతో దినములు గడ పెను. రెండవపార్వతి యనఁదగిన యీమె మహాత్మ్యము నెవ్వరు తగినట్టుగ వర్ణింపఁగలరు?" ఈ మహనీయురాలిచరిత మును గుఱించి యింతకంటె నధిక మేమియుఁ దెలియదు కాన విధిలేక మిగులచింతతో దీనిని ముగించుచున్నదాన.

Vedam and Co., Printers. 13, Oil Monger Street, Madras.

